జ్యోతిష శాస్త్ర ఆణిముత్యాలు (చిట్కాలు)

జ్యోతిష్యుడు జాతకాన్ని పరిశీలించి జాతకుడికి చెప్పేటప్పుడు మంచిని ఎక్కువగా చెడుని తక్కువగా చెప్పాలి. జాతకంలో గ్రహాలు చెడు చేస్తాయి అని అనుకున్నప్పుడు మంచిని కూడా చేస్తాయి. మంచి వాటి గురించి ఆలోచింపజేయాలి. చెడ్డవాటిని వర్ణించకూడదు. ఎదుటి వ్యక్తిని మెప్పించటం కోసం లేనివి చెప్పటం తగదు. అది మంచి ఐన చెడు ఐన సరే.

గ్రహాలలో పాజిటివ్, నెగిటివ్ అనే రెండు కారకత్వాలు ఉంటాయి. రెండిటి సమన్వయంతో జాతక పరిశీలన చేయాలి. ఉదా:- రవి – సమస్యా పరిష్కారం (పాజిటివ్), కోపం (నెగిటివ్). కాబట్టి కోపంతో ఉంటే సమస్య పరిష్కారం కాదు. మనం చేసే క్రియల వలన పాపాన్ని బలపరచటం, పుణ్యాన్ని బలహీనపరచటం జరుగుతుంది.

ఒక శిశువుకి మరొక శిశువుకి జన్మించటానికి మధ్య తేడా 1 నిమిషం 36 సెకండ్లు. పుట్టిన వెంటనే శిశువు ఏడ్చినప్పుడు గ్రహాలు శరీరంలోకి ప్రవేశిస్తాయి. మానససాగరి ప్రకారం శిశువు జన్మించిన ఆరవ రోజు మనిషికి బ్రహ్మ వ్రాత వ్రాస్తాడు.

మనం మరణించిన తరువాత కూడా బ్రతికి ఉండాలంటే భాగ్యస్థానం బాగుండాలి. భాగ్యస్థానం బాగుంటే పూర్వ పుణ్య బలం వలన మరణించిన తరువాత కూడా మన పేరు ప్రఖ్యాతల వలన అందరి గుండెల్లో బ్రతికే ఉంటాం.

రత్నధారణ చేసేటప్పుడు అభివృద్ధి కోసం కుడిచేతికి ధరించాలి. ఆరోగ్యం కోసం ఎడమచేతికి ధరించాలి.

బ్రతికున్న వ్యక్తి జాతకములనే సాధారణంగా పరిశీలించవలసి ఉంటుంది. అయితే దైవజ్ఞుని జ్ఞానములు పరిశీలించే నిమిత్తం చనిపోయిన వ్యక్తి జాతకమును ఇచ్చినప్పుడు ఆ దైవజ్ఞుడు నిమిత్తములను అనుసరించి విచారణ చేయవలసి ఉంటుంది. ఇష్టదేవతా సిద్ధి చేత దీనిని గ్రహించవచ్చు. ఆయుర్దాయంను విచారణ చేయటం ద్వారా దీనిని నిర్ణయించవచ్చును. అందుకే జాతకంలో యోగాలు మిగతా అంశాలు చెప్పేటప్పుడు ఆయుర్దాయాన్ని పరిశీలించాలి. కానీ ఆయుర్దాయ విషయాలను జాతకునికి తెలియజేయరాదు.

భావచక్రము వలన పుట్టిన దగ్గర నుండి చావు మధ్యలో ఉండే అంశాలను తెలుసుకోవచ్చును. భావ మధ్యమంలో గ్రహం ఉంటే ఆ భావ ఫలితాలను ఆ గ్రహం సంపూర్ణంగా ఇస్తుంది. భావ అంత్యంలో గ్రహం ఉంటే ముందు భావ ఫలితాలను కూడా ఇస్తుంది.

దానం చేసిన వస్తువును తీసుకున్న వ్యక్తి స్వీకరించి అనుభవించాలి, ఆనందించాలి, మెచ్చుకోవాలి. అప్పుడే మనం చేసిన దానికి దాన ఫలితం లభిస్తుంది. అలాకాని పక్షంలో మనస్సులోనే దానం చేసినట్లుగా భావించాలి.

కుజుడు వ్యయస్థానంలో ఉంటే చేసిన అప్పులు తీర్చటానికి మరలా మానవ జన్మ ఎత్తుతారు. అందుకే కుజుడు వ్యయంలో ఉన్నప్పుడు ఋణానుబంధాలను తీర్చుకోవాలని అంటారు.

ఇంద్ర, వరుణ, యములు అతీంద్రియ శక్తులకు ప్రతీక. అమావాస్య నాడు పుట్టినవాడు కష్టపడకుండానే (శ్రమించకుండా)డబ్బు సంపాదిస్తాడు.

బొగ్గుతో ఎంత అప్పు ఉన్నదో నేలపైన రాసి కుజునికి ఋణ విమోచన అంగారక స్తోత్రం 40 రోజులు చేసి ఎడమకాలితో తుడిపి వేసిన అప్పు తొందరగా తీరును.

ఇష్టదేవతోపాసన సాధనచేస్తే పశ్న శాస్త్రం సిద్ధిస్తుంది. జాతకచక్రంలో అన్నీ భావాలు భాగలేకపోయిన పంచమభావం, చంద్రుడు భాగుంటే తెలివైన ఆలోచనతో జీవితాన్ని నెగ్గుకురాగలాడు.

జాతకంలో అన్నీ లగ్నాలకి తృతీయాధిపతి శత్రువే అవుతాడు. ఒక్క కర్కాటక లగ్నానికి మాత్రమే తృతీయాధిపతి మిత్రుడు అవుతాడు. అందుకే కర్కాటక లగ్నం వాళ్ళు తప్ప మిగతా వాళ్ళు చెప్పిన మాట వినరు.

కర్కాటక లగ్నం వాళ్ళకి, సింహ లగ్నం వాళ్ళకు వైవాహిక జీవితం మిగతా గ్రహ పరిస్థితులు అనుకూలంగా లేకుంటే ఇబ్బందులు ఎదుర్కొంటారు. కర్కాటక లగ్నం వాళ్ళకు సప్తమాధిపతి, అష్టమాధిపతి ఒక్కరే కావటం, సింహలగ్నానికి షష్ఠాధిపతి, సప్తమాధిపతి ఒక్కరే కావటం వలన ఇబ్బందులు ఉంటాయి. సప్తమాధిపతికి షష్ఠం, అష్టమం ఆదిపత్యం రాకూడదు.

ఊర్ధ్వముఖ త్రికోణంలో (కోణాలలో) మంచి గ్రహాలు ఉంటే మంచిది. అధోముఖ త్రికోణంలో (కేంద్రంలో) పాప గ్రహాలు ఉంటే మంచిది.

జాతకచక్రంలో ఆప్యాయత, ఆదుకునే వ్యక్తిని (తల్లైన, తండ్రైన) చతుర్థంలో చూడాలి. అదుపు చేసేవారిని, అధికారం చూపించేవారిని (తల్లైన, తండ్రైన) దశమంలో చూడాలి. తల్లిదండ్రులు ఎంత చెడ్డవారైనా తప్పనిసరిగా ఆధరించాలి. ఎవరిని బాధ పెట్టిన తల్లిని మాత్రం బాధ పెట్టరాదు.

ఆధ్యాత్మిక వారసత్వాన్ని నవమభావంలో చూడాలి. లౌకిక జ్ఞాన వారసత్వాన్ని దశమ స్థానంలో చూడాలి. స్నేహం పెంచుకోవాలి అనుకుంటే అతడు (భర్త) లేకుండా ఆమెతో (స్నేహితుడి భార్య) మాట్లాడరాదు.